Islami Fikr-e-Nikah
(Telugu)

# ఇస్లాంలో
# నికాహ్ భావన

ఉర్దూ మూలం

**అబుల్ అజ్మ్**

తెలుగు అనువాదం

**ముహమ్మద్ అజీజుర్రహ్మాన్**

# ముందుమాట

భారత ముస్లిం సమాజంలో నానాటికీ పెరిగిపోతున్న విచ్చలవిడి తనం, మార్గవిహీనత, పాశ్చాత్య భావజాలం ఎన్నో సమస్యల్ని సృష్టించింది, మరెన్నో సవాళ్ళను విసిరింది. దీనికి వ్యతిరేకంగా దేశంలోని విభిన్న మూలల నుంచి సంస్కరణోద్యమాలు మొదలయ్యాయి. ఇది స్వాగతించ దగిన విషయం.

ముస్లిం సమాజంలో వివాహాది శుభకార్యాల పేరుతో ఎన్నో ఆచార, దురాచారాలు, అజ్ఞాన పోకడలు, ఇస్లామేతర పద్ధతులు చోటుచేసు కున్నాయి. ఒకవైపు వరకట్నం, మరోవైపు దుబారా ఖర్చుతో కూడిన పెళ్ళిళ్లు ఇస్లామీయ వివాహంలోని పరమార్థాన్ని దెబ్బతీస్తున్నాయి.

ఈ తీరువల్లనే నేటి నవతరానికి ఇస్లామీయ వివాహ భావన గురించి తెలియని పరిస్థితి!

నికాహ్ ఒప్పందం ద్వారా దాంపత్య జీవితంలోకి అడుగుపెట్టిన కొత్త దంపతులకు ఇస్లామీయ షరీయతు సూత్రాలను, వారి హక్కులు - బాధ్యతలను తెలియపరచవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఎందుకంటే తమ బాధ్యత తెలీకపోవటం చేత నిత్య జీవితంలో ఎదురయ్యే ఎన్నో

సమస్యలను వాళ్లు ఉత్తమ రీతిలో పరిష్కరించుకోలేకపోతారు. తత్కారణంగా కాపురంలో కలతలు మొదలవుతాయి.

అందుకే నికాహ్‌పై వ్రాసిన ఈ చిరు పుస్తకంలో నవ దంపతులకు ఇస్లామీయ షరీయతు వెలుగులో కొన్ని నిర్దేశిక నియమాలు ఇవ్వబడ్డాయి. ఈ అంశాన్ని సర్వవ్యాప్తం చేసే ఉద్దేశ్యంతో 'కితాబున్నికాహ్' అనే నా పుస్తకాన్ని సంక్షిప్తీకరించి 'ఇస్లామీ ఫిక్రె నికాహ్' అనే పేరుతో ఒక చిరు పుస్తకంగా 2008లో వెలువరించాను. దేశంలోని వివిధ రాష్ట్రాలలో పలు సంస్థలు, సంస్కరణోద్యమాలు, ఫౌండేషన్లు దీనిని పెద్ద సంఖ్యలో ప్రచురించాయి.

నికాహ్ సంప్రదాయాన్ని పాఠకులు అర్థం చేసుకోవడానికి తదను గుణంగా ఆచరించటానికి ఈ చిరుపుస్తకం దోహదకారి అవుతుందని, యువతరానికి స్ఫూర్తిదాయకమౌతుందని ఆశిస్తున్నాను. కారుణ్య ప్రభువు అయిన అల్లాహ్ ఈ అల్ప కృషిని దయతో ఆమోదించి, దీనిని పాఠకుల కొరకు ప్రయోజనకారిగా చేయాలని వేడుకుంటున్నాను – ఆమీన్.

**– అబుల్ అజ్మ్**

అనంత కరుణామయుడు పరమ కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో

# ఇస్లామీయ వైవాహిక వ్యవస్థ

ఆది మానవులైన ఆదం-హవ్వాల దాంపత్య బంధంతోనే ప్రపంచంలో మానవ మనుగడకు పునాది ఏర్పడింది. మానవ జాతులకు, జనావాసాలకు, సంతతులకు పునాది కూడా ఇదే. ఇస్లామీయ దాంపత్య వ్యవస్థ అత్యంత ప్రాచీనమైనది, విస్తృతమైనది, ఉన్నతమైనది, పారదర్శకమైనది. ఒక వైపున అది నికాహ్‌ను (వివాహాన్ని) మనసును కుదుటపరిచే సంస్కారవంతమైన సాధనంగా ఖరారు చేస్తూనే, మరో వైపున ఆలుమగలు ఒండొకరు తమ హక్కులు-బాధ్యతల్ని నెరవేర్చే సంతులితమైన కార్యాచరణను కూడా ప్రతిపాదించింది. ఇంకొకవైపు ఈ వైవాహిక వ్యవస్థను ఇస్లామీయ సముదాయ క్రమ వికాసానికి ఒక కీలకమైన యూనిట్ (ఏకాంకం)గా కూడా ఖరారు చేసింది.

# ఇస్లామీయ దాంపత్య సిద్ధాంతం

ఇస్లామీయ దాంపత్య సూత్రం సైద్ధాంతిక, ఆధ్యాత్మిక, భౌతిక, ఆర్థిక, సామాజిక పునాదులపై నెలకొని ఉంది. దీని సూత్రాలు సరళమైనవి, స్పష్టమైనవి, విపులమైనవి.

ఇస్లామీయ దాంపత్య సూత్రం జన సామాన్యానికి అందించిన వివాహ చట్టం స్పష్టంగానూ, సాదాసీదాగానూ ఉంది. దాంపత్య బంధంలో తలెత్తే సమస్యలకు సముచిత పరిష్కారం కూడా అందులో ఉంది. ఒక్కమాటలో చెప్పాలంటే ఇస్లామీయ శాసనం ప్రపంచం ఉన్నంత వరకూ శుభాత్ములైన స్త్రీ-పురుషుల కొరకు దేదీప్యమానమైన జీవన జ్యోతిగా అలరారుతుంది.

ఒక స్త్రీ–ఒక పురుషుడు పరస్పరం వైవాహిక బంధంలో ఇమిడి పోవటానికి ఇస్లాం ఒక సరళమైన పద్ధతిని ప్రవేశపెట్టి, నీతిబాహ్యత, లైంగిక విశృంఖలత్వానికి సంబంధించిన ద్వారాలన్నింటినీ మూసివేస్తుంది. సమాజంలో ఉన్నత విలువలతో కూడిన కుటుంబ వ్యవస్థను అది పటిష్ఠం చేస్తుంది.

ఇస్లామీయ వైవాహిక భావన ఒక సజీవమైన, నిత్యనూతనమైన, ప్రగతిశీలకమైన సొసైటీ కొరకు సంస్కారవంతమైన అవకాశాలను సమకూరుస్తుంది. ఒక స్త్రీ–పురుషుణ్ణి మమేకం చేసి వారు ఉత్తమ రీతిలో కాపురం చేసుకోవటానికి, పురోగమించటానికి తప్పనిసరిగా ప్రోత్సహి స్తుంది.

ఇస్లామీయ వైవాహిక భావన శ్రేష్ఠమైనది, పరిపూర్ణమైనది, సంస్కార వంతమైనది. ఇస్లామీయ వివాహంలో భార్యాభర్తలు సంపూర్ణ అధికారం, స్వాతంత్ర్యం ఉన్న వ్యక్తులు. వారిరువురూ ఒండొకరిని గౌరవించుకునే, ఒండొకరి మానమర్యాదలను కాపాడుకునే, ఒండొకరి హక్కులను ఇచ్చిపుచ్చుకునే, ఒండొకరి బాధ్యతలను నిర్వర్తించే మౌలిక సూత్రాలు, నియమనిబంధనలు ఈ వివాహ వ్యవస్థలో కూలంకషంగా ఉన్నాయి.

మహనీయ ముహమ్మద్ (స) వారి ఆదర్శ జీవితంలో వైవాహిక విభాగం చాలా కీలకమైనది. విస్తృతమైనది కూడా. ఆయన (స) తన భార్యామణులతో ఉత్తమ రీతిలో కాపురం చేశారు. వారిపట్ల ప్రేమానురాగా లతో వ్యవహరించేవారు. తన సహచరులు సయితం వారి అర్ధాంగులతో అలాగే వ్యవహరించాలని ఆయన (స) కాంక్షించారు. ఒకసారి ఆయన (స) ఇలా అన్నారు :

“తన ఇంటివారి పట్ల మంచిగా మెలిగేవాడే మీలో అందరికన్నా మంచివాడు. ఇంటివారి పట్ల మంచిగా మెలిగే విషయంలో నేను అందరికన్నా ఉత్తముడను.”

అంతిమ హజ్జ్ ప్రసంగ సందర్భంగా కూడా మహాప్రవక్త (స) ఇస్లామీయ వివాహంలోని మర్మాన్ని గుర్తు చేస్తూ ఇలా అన్నారు :

"స్త్రీల యెడల సద్వ్యవహారం చేయమని నేను మీకు తాకీదు చేస్తున్నాను."

ఆలుమగల దాంపత్య జీవితం ఆనందంగా, సాఫీగా, సుఖశాంతులతో వర్ధిల్లటానికి కావలసిన కట్టుదిట్టమైన ఏర్పాట్లన్నీ ఇస్లామీయ వైవాహిక సిద్ధాంతం చేసింది. ఏ ఒక్క పార్శ్వాన్నీ అది ఉపేక్షించలేదు. దైవగ్రంథంలోనూ, దైవప్రవక్త (స) విధానంలోనూ ఉన్న ఈ స్పష్టమైన, కూలంకషమైన సూత్రాలను పాటించినట్లయితే సంసార రథం సాఫీగా సాగిపోతుంది.

## నికాహ్ మూలసూత్రాలు

ఇస్లామీయ వైవాహిక సిద్ధాంతం ప్రతిపాదించే కొన్ని ముఖ్య సూత్రాలు ఇవి :

1. ఎంపిక స్వేచ్ఛ

"........మీకు నచ్చిన స్త్రీలను ఇద్దరేసి, ముగ్గురేసి, నలుగురేసిగాని వివాహం చేసుకోండి. ....." (అన్ నిసా : 3)

మహనీయ ముహమ్మద్ (స) ఇలా సెలవిచ్చారు :

"వివాహిత స్త్రీ తన స్వవిషయంలో తన సంరక్షకునికన్నా ఎక్కువ హక్కు కలిగి ఉంటుంది. అవివాహిత స్త్రీ అయితే ఆమె అంగీకారం తప్పక పొందాలి. ఆమె మౌనం కూడా ఆమె అంగీకారానికి ఆనవాలు."

## హదీసులు

ఒక మహిళామణి దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చి, తన తండ్రి తన వివాహాన్ని ఆయన అన్నయ్య కుమారునితో జరిపించాడనీ, ఈ వివాహం తనకు సమ్మతం కాదని ఫిర్యాదు చేసింది. దైవప్రవక్త (స) ఆమెకు నిర్ణయం గైకొనే అధికారం ఇచ్చారు – అంటే ఆమె ఆ వివాహబంధానికి కట్టుబడి ఉండటానికి లేదా విడిపోయేందుకు స్వేచ్ఛనిచ్చారు. అప్పుడా స్త్రీ "నా తండ్రి జరిపించిన వివాహానికి నేను కట్టుబడి ఉంటాను. కాకపోతే కూతురి ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా పెండ్లి జరిపించే అధికారం తండ్రికి లేదని మహిళా లోకానికి తెలియజేయాలన్నదే నా ఉద్దేశ్యం" అని చెప్పింది.

## వివాహానికి ముందు ఒండొకరిని చూసుకోవటం మంచిది

హజ్రత్ ముగీరా బిన్ షోబా (రజి) తెలిపారు – తాను ఒక స్త్రీకి వివాహ సందేశం పంపినపుడు దైవప్రవక్త (స) ఇలా హితవు పలికారు: "ఒకసారి నువ్వామెను చూసుకో. తద్వారా మీ ఇద్దరి మధ్య అన్యోన్యత పెంపొందే అవకాశం ఎంతైనా ఉంది." ముగీరా (రజి) ఆ అమ్మాయి తల్లిదండ్రుల వద్దకు వచ్చి, ప్రవక్త (స) వారి హితోపదేశాన్ని వినిపించారు. అయితే అమ్మాయి తల్లిదండ్రులు అందుకు సుముఖంగా లేరు. కాని తెరవెనుకనే ఉన్న ఆ అమ్మాయి వెంటనే జోక్యం చేసుకుని, "దైవప్రవక్త (స) చూసుకోమని సలహా ఇచ్చినప్పుడు చూసుకోండి" అని చెప్పింది. ఆమె మాట ప్రకారం నేనామెను చూసి, పెళ్ళి చేసుకున్నానని ముగీరా (రజి) చెప్పారు.

"ఎవరయినా ఒక స్త్రీకి వివాహ సందేశం పంపినపుడు వీలైతే ఒకసారి ఆమెను చూసుకోవాలి."

## ఇష్టపడి నికాహ్ చేసుకోవటం

ఇస్లాం ప్రకారం స్త్రీ పురుషులు తమకు నచ్చిన, తాము మెచ్చిన వారిని వివాహమాడవచ్చు. కాని ప్రేమాయణానికి మాత్రం అనుమతి లేదు.

## రెండు పరిస్థితుల్లో మాత్రం వివాహ సందేశం పంపకూడదు

1. విడాకులు పొందిన స్త్రీ లేదా భర్త చనిపోయిన స్త్రీకి ఆమె గడువు (ఇద్దత్) కాలం ముగియక ముందే వివాహ సందేశం పంపకూడదు. అయితే సూచనాప్రాయంగా తెలుపవచ్చు.

2. సాటి ముస్లిం సోదరులు ఏదన్నా బేరం కుదుర్చుకున్నప్పుడు అతనికి పోటీగా వెళ్ళి బేరమాడకూడదు. అలాగే సాటి సోదరుడు ఒకచోట వివాహ సందేశం పంపి ఉన్నప్పుడు మరొకతను మధ్యలో తలదూర్చటం ధర్మసమ్మతం కాదు.

"ఒక వ్యక్తి వివాహ సందేశం పంపి ఉండగా – అతను తన సంకల్పాన్ని విరమించుకోనంత వరకూ లేదా అతను మరో వ్యక్తికి అనుమతి ఇవ్వనంత వరకూ – ఎవరూ (మధ్యలో) పోటీగా తమ తరఫున వివాహ సందేశం పంపరాదు."

## ధార్మికతకు గల ప్రాముఖ్యత

దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు :

"నాలుగు విషయాలను చూసి స్త్రీలను వివాహమాడటం జరుగుతుంది. 1. ఆస్తిని 2. అంతస్తును 3. అందాన్ని 4. ధార్మికతని. కాని మీరు మాత్రం ధార్మికతకు ప్రాముఖ్యమివ్వండి. మేలు జరుగుతుంది."

అల్లాహ్ 15 సంబంధాలను వివాహానికి నిషేధించాడు –

1. తల్లి 2. కూతుళ్ళు 3. సోదరి 4. మేనత్త 5. పిన్నమ్మ 6. మేనకోడళ్ళు 7. సోదరుని కుమార్తెలు 8. పాలిచ్చిన తల్లి 9. పాల వరుస సోదరి 10. అత్త 11. సవతి తల్లి 12. సవతి కూతురు 13. కోడలు 14. ఏకకాలంలో అక్కా చెల్లెళ్ళిద్దరినీ దాంపత్య బంధంలో ఉంచటం 15. వేరొకరి వివాహ బంధంలో ఉన్న స్త్రీ.

## కట్నకానుకలకై డిమాండు చేయటం

ఇస్లాం ప్రకారం వివాహ సందర్భంగా వరకట్నంగానీ, గృహ సామగ్రినిగానీ, మరే రకమైన కానుకలను గాని కోరటం సమ్మతం కాదు. ఇదంతా అధర్మమైన పద్ధతిలో ఇతరుల సొమ్మును కబళించటం క్రిందికి వస్తుంది. ఒకవేళ ఎవరయినా వరకట్నం తీసుకుని ఉంటే దానిని బేషరతుగా, మనస్ఫూర్తిగా అత్తవారికి తిరిగి ఇచ్చివేయటం మంచిది.

## ముస్లిం స్త్రీ ముస్లిమేతర పురుషుణ్ణి మనువాడ జాలదు

"ముష్రిక్కు పురుషులు విశ్వాసులు కానంతవరకు మీరు మీ మహిళలను వారికిచ్చి ఎన్నటికీ వివాహం చెయ్యకూడదు." (అల్ బఖర – 221)

## బహుభార్యాత్వం

"మీకు నచ్చిన స్త్రీలను ఇద్దరేసి, ముగ్గురేసి, నలుగురేసిగాని వివాహం చేసుకోండి." (అన్ నిసా : 3)

## న్యాయం చేయాలన్న షరతు

"అయితే వారితో న్యాయం చేయలేమనే భయం మీకుంటే, అప్పుడు ఒకామెనే చేసుకోండి." (అన్ నిసా : 3)

"భార్యల మధ్య పూర్తి న్యాయం చెయ్యటం మీ శక్తికి మించిన పని. మీరు ఎంత కోరినా దీనిని సాధించలేరు. కనుక ఒక భార్య వైపునకు మొగ్గి మరొకామెను డోలాయమాన స్థితిలో పడవెయ్యకండి."

(అన్ నిసా : 129)

## విడాకులు పొందిన మహిళతో లేదా వితంతువుతో వివాహం

"మీరు మీ స్త్రీలకు విడాకు లిచ్చినప్పుడు, వారి కొరకు నిర్ణయించ బడిన గడువు (ఇద్దత్) దగ్గరపడగానే, వారిని సహృదయంతో మీ వద్ద ఉంచుకోవాలి లేదా మంచితనంతో సాగనంపాలి." (అల్ బఖర : 231)

## సంప్రదాయబద్ధమైన నికాహ్ షరతులు

మౌలికంగా నికాహ్ షరతులు నాలుగు :

1. అంగీకారం (సమ్మతి)

2. మహర్ నిర్ధారణ

3. ఇద్దరు సాక్షులు

4. వధువు తండ్రిగానీ, లేదా ఆమె తరపు సంరక్షకుడు (వలీ) గాని నికాహ్ సమయంలో ఉండటం.

**1. అంగీకారం (సమ్మతి)**

❖ పురుషుడు స్త్రీని అర్ధాంగిగా స్వీకరించటం. వివాహ సందేశం పంపిన పురుషుణ్ణి స్త్రీ తన జీవిత భాగస్వామిగా స్వీకరిస్తున్నట్లు అంగీకరించటం.

❖ వివాహ సందర్భంగా వధూవరులిద్దరి అంగీకారం తప్పనిసరి. వధువు సమ్మతితో నిమిత్తం లేకుండా జరిగే నికాహ్ నికాహ్‌యే కాదు.

**2. మహర్ సొమ్ము నిర్ధారణ**

ఇది ఇస్లామీయ వివాహం (నికాహ్) లోని రెండవ షరతు. భర్త భార్యకు మహర్ సొమ్మును చెల్లించటం తప్పనిసరి. ఎందుకంటే మహర్ (సొమ్ము) భార్య హక్కు.

ఖుర్‌ఆన్‌లో ఈ విధంగా సెలవీయబడింది :

"స్త్రీల మహర్ సొమ్మును న్యాయమైన పద్ధతిలో ఇవ్వండి." (అన్ నిసా : 25)

## నగదు వ్యవహారం - అరువు వ్యవహారం

(మహరె **ముఅజ్జల్** - మహరె **మువజ్జల్**)

❖ నికాహ్ జరిగే సమయంలోనే నగదుగా చెల్లించే మహర్‌ను మహరె ముఅజ్జల్ అంటారు.

❖ నికాహ్ సమయంలో మహర్ పరిమాణం నిర్ధారించబడి నప్పటికీ, వీలు చూసుకుని తరువాత భార్యకు చెల్లించే వెసులుబాటు కలిగినదే మహరె మువజ్జల్.

❖ మహర్ అనేది భార్య స్వంత ఆస్తి. దాన్ని క్షమించి వదలిపెట్టే అధికారం ఆమెకు మాత్రమే ఉంది.

ఒకవేళ భార్య మనస్ఫూర్తిగా మహర్‌లో కొంత భాగాన్ని భర్తకు వదలిపెడితే దాన్ని భర్త నిస్సంకోచంగా వాడుకోవచ్చు.

## భార్య 'ఖులా' పొందగోరినప్పుడు ...

ఒకవేళ భార్య 'ఖులా' పద్ధతి ద్వారా తనంతట తానుగా భర్త

నుంచి విడిపోదలిస్తే అట్టి పరిస్థితిలో ఆమెకు రావలసిన మహర్‌ను వదులుకోవలసి ఉంటుంది.

## ఇచ్చిన మహర్‌ను తిరిగి తీసుకోకూడదు

అన్ నిసా సూరాలోని 20వ వాక్యంలో ఇలా అనబడింది : "మీరు ఆమెకు ఒక పెద్ద ధనరాశిని ఇచ్చి ఉన్నాసరే దాని నుండి ఏ కొంచెం కూడా తిరిగి తీసుకోవద్దు."

"మహర్ పరిమాణం ఒక టెంక మొదలుకుని ఒక పెద్ద ధనరాశి వరకు ఎంతైనా నిర్ధారించవచ్చు."

అల్ బఖర సూరాలోని 236వ వచనంలో ఇలా ఆదేశించబడింది:

"మీరు మీ స్త్రీలను ముట్టుకోకముందే లేక వారి మహర్ (స్త్రీ ధనం) నిర్ణయం కాకపూర్వమే మీరు వారికి విడాకులిస్తే, అది పాపం కాదు. అప్పుడు మీరు వారికి ఏదో కొంత తప్పకుండా ఇవ్వాలి. ధనవంతుడైన వ్యక్తి తన శక్తి కొలదీ, పేదవాడైన మనిషి తన స్థితిని బట్టీ ధర్మసమ్మతమైన విధంగా చెల్లించాలి."

### 3. ఇద్దరు సాక్షులు

ఒక పురుషుడు - ఒక స్త్రీకి మధ్య జరిగే ఒడంబడికే నికాహ్. కాబట్టి అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు -

"నికాహ్ సమయంలో మీలోని ఇరువురు వ్యక్తుల్ని సాక్షులుగా పెట్టుకోండి."

### 4. వధువు తండ్రి లేక సంరక్షకుడు ఉండాలి

వివాహ సమయంలో వధువు తండ్రి లేక సంరక్షకుడు (వలీ) అక్కడ ఉంటే ఏ విధమైన అనర్థం జరగదు. పైగా వారుండటం వల్ల

దాంపత్య బంధానికి మరింత బలం చేకూరుతుంది. స్త్రీకి ఎల్లప్పుడూ తన కుటుంబీకుల తరఫున రక్షణ, మద్దతు లభిస్తుంది.

## నికాహ్ ప్రసంగం

నికాహ్ ప్రసంగం ఇవ్వటం ఉత్తమం, అభిలషణీయం. ఒకవేళ నికాహ్ ప్రసంగం జరగకపోయినా నికాహ్ జరిగిపోతుంది. ఎందుకంటే నికాహ్ ప్రసంగం నికాహ్ షరతులలో లేదు.

## వలీమా

ఏదైనా ఒక ప్రత్యేక విందు ఆహ్వానాన్ని అరబీలో 'వలీమా' అంటారు. షరీయతులో కూడా వలీమా అనే పదం ప్రయోగించబడింది. వలీమా నికాహ్ (వివాహ) షరతులలో అంతర్భాగం కాదు. కాని ఇది మస్నూన్ (సంప్రదాయం). విశ్వాసి అయిన ప్రతి వ్యక్తి తన వివాహం తరువాత వలీమా చేసి స్థోమతకు తగ్గట్టుగా కొంతమందిని విందుకు ఆహ్వానించాలి. ఎందుకంటే వలీమాలో శుభం ఉంది.

పైన పేర్కొనబడిన 4 షరతులు, రెండు వాంఛనీయమైన అంశాలు తప్ప ఇస్లామీయ వివాహంలో మరే అంశానికీ ఎలాంటి ప్రాముఖ్యం లేదు. కాకపోతే కొన్ని పాక్షిక, సాపేక్షిక విషయాలు ఆయా ప్రాంతాల సంస్కృతీ నాగరికతలను బట్టి వివాహ సందర్భంగా అభివ్యక్తమవు తుంటాయి. అయితే ఇస్లామీయ షరీయతులో అవి తప్పనిసరి అయిన అంశాలు మాత్రం కావు.

## దాంపత్య జీవితంలో కొన్ని ముఖ్య సూత్రాలు

నికాహ్ అవగానే ఆలుమగలు ఓ కొత్త జీవితంలో అడుగు పెడతారు. తమ దాంపత్య జీవితంలో సుఖ సంతోషాలు, ప్రేమానురాగాలు పండించు కోవటానికి మొదటి నుంచే ఇస్లామీయ మౌలిక ఉపదేశాలకు కట్టుబడి

ఉండటం మంచిది. తమ సంసార రథాన్ని ధర్మపథంలో ముందుకు సాగిస్తే ఇహంలోనూ, పరంలోనూ ఆ దంపతులు సాఫల్యం పొందుతారు. అలాకాకుండా తాత్కాలిక తళుకుబెళుకులకు మోసపోయి అధర్మానికి, విచ్చల విడితనానికి లోనవుతే జీవితంలో ఆటుపోటులు తప్పవు. ఒకవేళ ప్రాపంచిక జీవితంలో ఎలాగోలా జీవిత నౌకను ఒడ్డుకు చేర్చినా, పారలౌకిక జీవితంలో వారికి పరాభవం తప్పదు. ఎందుకంటే అడుగడుగునా షైతాన్ పొంచి ఉంటాడు. నవ దంపతులు గనక ఆ మాయలమారి ఉచ్చులోపడి పోతే వారి చల్లని లోగిలిలో ఆనందం నిండదు, అనురాగం పండదు.

## నవ దంపతులకు ఇస్లామీయ మౌలిక ఉపదేశాలు

1. వారు పెద్ద పాపాలన్నింటికీ - ఉదాహరణకు : అవిశ్వాసం (కుఫ్ర్), బహుదైవోపాసన, మద్య సేవనం, వ్యభిచారం, జూదం, వడ్డీ, అన్యాయంగా ఒకరిని చంపటం వంటి వాటికి బహుదూరంగా ఉండాలి.

2. వారు అన్యాయం, అత్యాచారం, అసత్యం, దగా, మోసం, స్వామిద్రోహం, చాడీలు, పరోక్షనింద, వాగ్దానభంగం, జ్యోతిషం, చేతబడి, క్షుద్రవిద్యల వంటి చెడులకు దూరంగా మసలుకోవాలి.

3. దేవుడు నిషేధించిన విషయాలకు వారు దూరంగా ఉండాలి - అంటే బంధుత్వ సంబంధాలను త్రెంచటం, అధర్మ సంపాదన తినటం, పొరుగువారి హక్కులను, ఆలుబిడ్డల హక్కులను ఇవ్వకపోవటం, గర్వాన్ని ప్రదర్శించటం, తప్పుడు సాక్ష్యమివ్వటం, శీలవతులైన స్త్రీలపై అభాండాలు మోపటం, దైవమార్గంలో అవరోధాలు కల్పించటం, సమాజంలో ఉపద్రవాన్ని సృష్టించటం - లాంటి విషయాలకు దూరంగా ఉండాలి. తద్భిన్నంగా ఏ ఏ సుగుణాలను తమలో సృజించుకోవాలని దేవుడు ఆదేశించాడో వాటి కొరకు మనస్ఫూర్తిగా యత్నించాలి.

4. విశ్వాసంలో స్వచ్ఛత, సవ్యమైన ఆలోచన, సత్కార్యం, భయభక్తులు, నిగ్రహం – సంయమనం, క్షమ, జాలి, మృదుత్వం, విశాల దృక్పథం, ధర్మావగాహన, ధర్మచింతన, విజ్ఞత, వివేచన, ముందుచూపు, ఆత్మావలోకనం, ఆత్మీయత, ఆప్యాయత, సోదరభావం, సౌహార్ద్రత, సంఘీభావం, ఐకమత్యం, పెద్దల పట్ల ఆదరణ, చిన్నలపట్ల వాత్సల్యం, బలహీనులకు, అగత్యపరులకు, నిరుపేదలకు, అనాథలకు, వితంతువులకు తోడ్పడాలన్న దయాభావం, ఖైదీలకు, బాటసారులకు సహాయమందించటం – ఇవన్నీ ఉత్తమ మానవీయ గుణాలు. అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త (స) మనకు ఆదేశించిన విషయాలివి. వీటిని నెరవేర్చటానికి శాయశక్తులా కృషి చేయాలి. సమాజంలో సంస్కరణకు ప్రయత్నించాలి. దైవాదేశాలకు బద్ధులై ఉంటూ నిషిద్ధ అంశాలను విడనాడాలి. దైవమార్గంలో పిలుపు ఇవ్వాలి. సంఘ సేవచేయాలి. మంచిని పెంపొందించాలి. సత్కార్యాల కొరకు సాటి వారిని ప్రోత్సహించాలి. దైవమార్గంలో నిరంతర సాధన చేస్తూ జీవించాలి – ఇవి మన జీవితానికి సంబంధించిన మూల సూత్రాలు.

ముస్లిం ఆలుమగలు సంతోషదాయకమైన జీవితం గడపటానికి కొన్ని సంసార సూత్రాలకు కట్టుబడాలి. అవేమంటే –

## భర్త పాటించవలసిన సూత్రాలు

నికాహ్ (వివాహం) ద్వారా దంపతులు ఓ కొత్త జీవితంలో అడుగు పెడతారు. భర్త ఇంటికి యజమాని కాబట్టి కుటుంబ పోషణా భారాన్ని షరీయతు అతనిపైనే మోపింది. అతను తన స్థోమతకు తగ్గట్టుగా ఉత్తమ రీతిలో ఆలుబిడ్డల పోషణా బాధ్యతను స్వీకరించాలి.

1. తన కుటుంబ పోషణకై అతను తన తల్లిదండ్రులపైగానీ, అత్తవారిపై గానీ ఆధారపడకూడదు. అలాగే కుహనా ప్రతిష్ఠలకు పోయి ఆదాయానికి మించిన ఖర్చులు చేయకూడదు. అలాచేస్తే అప్పులపాలై కుటుంబ మర్యాదను దిగజార్చిన వాడవుతాడు. సమాజంలో గౌరవప్రదమైన జీవితం గడిపేందుకు భర్త తీవ్రంగా పరిశ్రమించి తన ఇల్లు చక్కదిద్దుకునేందుకు యత్నించాలి.

**2. ఉత్తమ రీతిలో కాపురం :** భర్త బాధ్యతల్లో అత్యంత ముఖ్యమైనదేమంటే అతను తన భార్యలతో ఉత్తమ రీతిలో సంసారం చేయటం. చీటికీ మాటికీ చిర్రుబుర్రుమనకుండా, అర్ధాంగిలోని చిన్న చిన్న లోపాలను ఉపేక్షిస్తూ సంసార నౌకను ముందుకు నడపాలి.

3. భర్త తన భార్యపట్ల ప్రేమపూర్వకంగా మసలుకోవాలి. ఎల్లప్పుడూ ఆమెపై దయాభావంతో, దాక్షిణ్యంతో వ్యవహరించాలి.

4. భార్య భరించలేనంత పనిభారాన్ని ఆమెపై మోపరాదు. ఆమె విశ్రాంతిని, ఆరోగ్యాన్ని దృష్టిలో ఉంచుకుని తగినంత పని మాత్రమే ఇవ్వాలి. వీలైతే ఇంటిపనుల్లో భర్త ఆమెకు సహాయపడాలి.

5. ఉమ్మడి కుటుంబంలోనే సర్దుకుపోవాలని భార్యను బలవంతం చేయకూడదు ...

6. భార్యను తిట్టరాదు, కొట్టరాదు. పైగా సంసారంలో కలతలు వచ్చినప్పుడు సంప్రతింపుల ద్వారా అంగీకారానికి రావాలి.

7. ఆర్థిక ఇబ్బందులు ఎంత తీవ్రతరంగా ఉన్నప్పటికీ డబ్బు సమకూర్చమని భార్యను, అత్తవారిని వేధించరాదు.

8. భార్య యొక్క ధర్మసమ్మతమైన కోర్కెలను తీర్చవలసిన బాధ్యత భర్తపై ఉంది. కాబట్టి ఎలాంటి విసుగును, చికాకును వ్యక్తపరచకుండా భార్యను సుఖపెట్టడానికి భర్త శాయశక్తులా ప్రయత్నించాలి.

9. భర్తకు ఒకరికన్నా ఎక్కువమంది భార్యలున్నప్పుడు వారికి ఉచిత రీతిలో సౌకర్యాలు కల్పించాలి. వారికి సమానంగా సమయం కేటాయించాలి. న్యాయసమ్మతంగా ఖర్చులకు డబ్బు ఇవ్వాలి.

10. భార్యకు సోదరులుగానీ, దగ్గరి బంధువులుగానీ లేనట్లయితే ఆమె తల్లిదండ్రులను (అంటే అత్తామామలను) చేరదీసి వారి మంచీ చెబ్బరలను చూస్తూ ఉండాలి. ఇది నైతిక బాధ్యత.

11. భార్య సొమ్మును, ఆమె ఆస్తిపాస్తులను భర్త ఒక అప్పగింత (అమానతు)గా భద్రపరచాలి. ఆ సొమ్మును తన సొంత ఖర్చులకు వాడుకో రాదు. ఇది ఒక భర్తకు శోభాయమానం కూడా కాదు. ఎందుకంటే భార్యపోషణా భారం భర్తపై మోపబడింది.

12. భార్య ఇచ్చే మంచి సలహాలను భర్త తప్పకుండా స్వీకరించాలి. అయితే భార్య ప్రేమలో పడి గుడ్డిగా ఆమె చెప్పే ప్రతి మాటను తుదివాక్కుగా భావించరాదు.

13. అత్తవారి తరఫు బంధువులకు - తన తరఫు బంధువులకు అతిథి మర్యాదలు చేయటంలోగానీ, సహాయ సహకారాలందించటంలో గానీ సమతూకం పాటించాలి.

14. ఇంట్లో దుబారా ఖర్చు చేయరాదని భార్యకు ప్రేమతో నచ్చజెప్పాలి. ఖర్చులపై నియంత్రణ అవసరమనుకుంటే భార్యాబిడ్డలను ఎప్పటికప్పుడు లెక్క అడుగుతుండాలి.

15. అలా అని భర్త మరీ పిసినిగొట్టుగా కూడా ప్రవర్తించకూడదు. సముచితమైన ఖర్చులకు కూడా డబ్బు ఇవ్వకుండా చేతిని కట్టిపడేసుకోరాదు. పైగా భార్యాపిల్లల విద్య, వైద్య సదుపాయాల కోసం, వారి మనోల్లాసం కోసం, అన్న వస్త్రాల కోసం సముచితమైన రీతిలో ఖర్చుపెట్టాలి.

16. అత్తవారి తరఫు ఆడవాళ్ళతో – మరీ ముఖ్యంగా మరదళ్ళతో పరదా పాటించాలి.

17. భర్త తన ఇంట్లో అనుదినం స్నేహితులతో కలిసి రాత్రి పొద్దుపోయేదాకా పిచ్చాపాటీ కబుర్లు చెప్పుకుంటూ కూర్చోవటం మంచి పద్ధతి కాదు. ఇలాంటి వ్యర్థ విషయాల కోసం ఇంట్లో ఒక గదిని ప్రత్యేకించుకోవటం కూడా సబబు కాదు.

18. ఇంటికొచ్చే మిత్రుల ఫ్యామిలీలు చనువుగా ఉంటున్నాయని తన ఇంటివారిని కూడా అలాగే తయారవమని చెప్పటం సరికాదు. పైగా అలాంటి ఫ్యామిలీలకు దూరంగా ఉంటేనే మంచిది.

19. భర్త తానెదుర్కొనే కష్టనష్టాలను, ఇబ్బందులను గురించి అవసరం మేరకు భార్యకు చెప్పుకుంటూ ఉండాలి. క్లిష్టమైన సమస్యలను, ఆందోళనకరమైన విషయాలను గురించి మాత్రం భార్యకు చెప్పకూడదు. ఎందుకంటే స్త్రీలలో కొంతమందికి తట్టుకునే ధైర్యం ఉండదు.

20. భర్త పగలంతా తాను పడిన అవస్థ గురించి భార్యకు తెలియపరచటం కూడా భావ్యం కాదు.

21. భర్త భార్యను సత్కార్యాలకు, దానధర్మాలకు పురికొల్పుతూ ఉండాలి. మంచిని పెంపొందించే, చెడుల నుండి వారించే విషయాలలో వ్యక్తిగత స్థాయిలోనూ, సామూహికంగానూ తన వంతు కర్తవ్యం నిర్వర్తించమని ఆమెకు చెబుతూ ఉండాలి. అలాంటి పనులలో భర్త ఆమెకు చేదోడు వాదోడుగా నిలవాలి.

22. దైవప్రసన్నతను చూరగొనేందుకు ప్రతి చిన్న పెద్ద వ్యవహారంలో త్యాగభావంతో వ్యవహరించాలని భార్యకు ప్రేరణ ఇస్తూ ఉండాలి. వంటావార్పు విషయంలో కఠినంగా వ్యవహరించకూడదు. పైగా మంచిని పెంపొందించే పనులలో ఖచ్చితంగా వ్యవహరించాలి. ఒకవైపు ఇంటిపనుల విషయంలో చీటికీ మాటికీ ఆమెను

చీదరించుకుంటూనే, మరోవైపు ధార్మిక కార్యకలాపాలలో ఆమె పాత్ర గురించి అసలేమీ పట్టించుకోకపోవటం సబబు కాదుకదా! ఇవి రెండూ అతివాదాలే.

23. ఇంట్లో టి.వి, వీడియో, ఆడియో, ఇంటర్నెట్‌లను విచ్చలవిడిగా వాడటం వల్ల జరిగే అనర్థాలేమిటో భార్యకు చెప్పి వాటిపై అంతర్గతంగా ఆంక్షలు విధించుకోవాలి. ఒకవేళ వాటిపై నియంత్రణ ఉంటే సరి. లేదంటే ఆ ఎలక్ట్రానిక్ వస్తువులను ఇంట్లో నుంచి తీసివేయాలి. అంతేగాని ఈ సాకుతో అర్థాంగిని తిట్టటం, కొట్టడం సరికాదు. దానివల్ల సంసార గొడవలు రచ్చకెక్కుతాయి.

24. దిద్దుబాటుకు ప్రయత్నించినప్పటికీ భార్య నడవడికలో పరివర్తన రాకపోతే ఆమెతో శాశ్వతంగా తెగత్రెంపులు చేసుకోవటమే ఉత్తమ పరిష్కారం. ఎందుకంటే భవిష్యత్తులో పిల్లలపై పడే దుష్ప్రభావాన్ని భరించటంకన్నా ఈ తెగత్రెంపులే నయం.

## భార్య పాటించవలసిన సూత్రాలు

1. అన్నిటికన్నా ముందు భార్య ఒక ఉత్తమ ఇల్లాలిగా రాణించేందుకు చిత్తశుద్ధితో ప్రయత్నించాలి. ఇందుకోసం ఆమె అధర్మ విషయాలకు, నీతిబాహ్యమైన పోకడలకు, నిషిద్ధాలకు దూరంగా ఉండాలి. దేవుడు విధించిన విద్యుక్త ధర్మాలు, తప్పనిసరి అంశాల (ఫరాయెజ్, వాజిబాత్)ను నిర్వర్తించటమే గాక, సంప్రదాయబద్ధమైన అంశాలను, వాంఛనీయమైన విషయాలను నిత్యజీవితంలో అవలంబిస్తూ ఉండాలి.
2. ఎట్టి పరిస్థితిలోనూ భర్త మనసు నొప్పించకుండా కుటుంబ వాతావరణాన్ని ఆహ్లాదకరంగా ఉంచేందుకు శాయశక్తులా కృషి చేస్తుండాలి. పడక దగ్గర నుంచి వడ్డించిన విస్తరి వరకు అన్ని విషయాలలోనూ భర్తను సంతృప్తపరచాలి. అతని అభిరుచిని దృష్టిలో పెట్టుకుని జాగ్రత్తగా మసలుకోవాలి.

3. భర్తను సంప్రతించి, అతని అనుమతి లభించనంతవరకూ ఒకరి దగ్గర అప్పు అడగటంగానీ, సహాయమడగటం గానీ చేయకూడదు.
4. భార్య తన భర్త సంపాదనను దృష్టి ఉంచుకోవాలి. అతని ఆదాయాన్ని బట్టి ఇంటి బడ్జెట్‌ను రూపొందించుకోవాలి. ఒకవేళ ఎప్పుడయినా అధిక ఆదాయం వస్తే అదెలా వచ్చిందో ఆరాతీయాలి. తన భర్తగాని లంచం తీసుకుంటున్నాడా! అక్రమ పద్ధతిలో సొమ్ము ఆర్జిస్తున్నాడా! ఒకవేళ అలాంటి అనుమానం వస్తే భర్తను నిలదీసి అడగాలి. తన అనుమానం నిజమని తేలితే ఆ అధర్మ సంపాదనతో ఆలుబిడ్డల కడుపు నింపవద్దని అతనికి తెగేసి చెప్పాలి. అప్పటికీ అతనిలో పరివర్తన రాకపోతే వంటపని మానెయ్యాలి. కొంతకాలం పాటు పుట్టింట్లో గడపాలిగాని ఆ హరామ్ సొమ్మును తినకూడదు.
5. పరదా (బురఖా) విషయంలో నిక్కచ్చిగా ఉండాలి. ఇంటి బయటకు వెళ్ళినా, ఇంట్లోకి పరాయివారు వచ్చినా, పరదా నియమాలకు కట్టుబడి ఉండాలి. భర్త అనుమతి లేనిదే పరాయి వారిని, అపరిచిత వ్యక్తులను ఇంట్లోకి రానీయకూడదు. అలాగే అపరిచిత వ్యక్తుల ఇంటికి పదే పదే వెళ్ళకూడదు.
6. భర్త అనుమతి లేనంత వరకూ దైనందిన ఖర్చులు మినహా పెద్ద ఖర్చులు చేయకూడదు. దుబారా ఖర్చుల జోలికి అసలే పోకూడదు. ఒక్కమాటలో చెప్పాలంటే భర్త సంపాదనకు ఆమె సంరక్షకురాలిగా ఉండాలి.
7. భర్త నెలసరి ఆదాయాన్నిబట్టి తన ధర్మసమ్మతమైన కోర్కెల్ని కోరాలి. బంగారు నగల కోసం, ఖరీదైన బట్టల కోసం భర్తను సాధించ రాదు. అలాచేస్తే భర్త గత్యంతరం లేక అప్పులు చేస్తాడు. తత్ఫలితంగా కుటుంబాన్ని పోషించటం గగనమై పోతుంది. కాబట్టి భార్య భర్త ఆర్థిక పరిస్థితిని అర్థం చేసుకుని అతనికి అండగా నిలిస్తే, అతనికి ధైర్యాన్ని నూరిపోస్తూ ఉంటే ఆ కాపురం పండంటి కాపురంగా

మారుతుంది. దంపతుల మధ్య ప్రేమానురాగాలు పెరుగుతాయి.

8. అత్తవారి తరఫు బంధువులను ద్వేషించరాదు. వారికి మర్యాదలు చేయటాన్ని చిన్నతనంగా భావించరాదు. అత్తవారి బంధువులను భారంగా తలపోయరాదు. ముఖ్యంగా అత్తామామలు వృద్ధాప్యంలో ఉన్నప్పుడు వాళ్ళను ఇంటి నుంచి గెంటివేయటం లాంటి నీచమైన చేష్టలకు పాల్పడకూడదు. అత్తింటి బిడ్డలను, రక్త సంబంధీకులను ఆదరించాలి.

9. అత్తింటికి వచ్చే పురుషులందరి ముందూ వెళ్ళకూడదు. షరీయతు ఎవరి ముందు పరదా పాటించాలని సూచించిందో వారి విషయంలో పరదా పాటించాలి. ముఖ్యంగా మరిది ముందు పరదా లేకుండా రాకూడదు. అత్తింట్లోని బాలబాలికలపై వాత్సల్యం కురిపించాలి. అత్తింటికి వచ్చే పేద బంధువుల్ని ఆదరించాలి. ఉన్నంతలోనే వారికి సహాయం చేస్తూ ఉండాలి.

10. భర్త స్నేహితులను గురించి ఆరా తీస్తుండాలి. చెడు సావాసాలకు దూరంగా ఉండమని భర్తకు నచ్చజెబుతూ ఉండాలి. సజ్జనుల, సంస్కారవంతుల సహచర్యంలో ఉండమని భర్తకు తాకీదు చేస్తూ ఉండాలి.

11. భర్త తన ఇతర భార్యల పట్ల న్యాయంగా వ్యవహరిస్తున్నప్పుడు అతనికి అభ్యంతరం చెప్పకూడదు. అటు తన సవతులను కూడా దూషించకూడదు. పైపెచ్చు సవతుల పట్ల సత్సంబంధాలు కలిగి ఉండాలి. వారితో సద్వ్యవహారం చేయాలి.

12. కాలక్షేపం కోసం ఇంటికి వచ్చే ఇరుగుపొరుగు మహిళలకు మరీ చనువు ఇవ్వకూడదు. వాళ్లు గనక ఇతరుల గురించి పరోక్షంగా నిందించటం, చాడీలు చెప్పటం లాంటివి చేస్తే వెంటనే జోక్యం చేసుకుని, వారించాలి.

13. భర్త చెడులకు, వ్యసనాలకు లోనవుతున్నట్లు తెలిస్తే అతనికి ఉతమ రీతిలో నచ్చజెప్పి దారికి తెచ్చుకోవాలి. దారికి రాకపోతే పడక గదిలో అతనికి దూరంగా ఉండాలి. ఇస్లామీయ షరీయతు ప్రకారం అలాంటి భర్తలో అప్పటికీ పరివర్తన రాకపోతే 'ఖులా' ద్వారా అతన్నుండి విడిపోవటమే సమస్యకు సరైన పరిష్కారం.
14. భర్త గనక భార్యను ఆరాధనల నుండి సత్కార్యాల నుండి, దైవమార్గం నుండి, ఆపుతుంటే అటువంటి భర్తతో కాపురం చేయటం ధర్మసమ్మతం కాదు.
15. భర్త గనక తిట్టడం, కొట్టడం, వేధించటం లాంటివి చేస్తుంటే నేర్పుతో సంస్కరణకు యత్నించాలి. అతనిలో ధార్మిక చైతన్యాన్ని మేల్కొల్పాలి. అప్పటికీ మార్పు కనిపించకపోతే తల్లిదండ్రులను గానీ, అన్నదమ్ములను గానీ సంప్రతించి సమస్యను పరిష్కరించుకోవాలి. పుట్టింటివారు ఎవరూ లేకపోతే ఇస్లామీయ సంస్థలను, జమాఅత్ పెద్దలనూ, ధార్మిక ప్రముఖులను సంప్రతించాలి. అన్ని ప్రయత్నాలు జరిగిన తర్వాత కూడా భర్తలో మార్పు కనిపించకపోతే ఇస్లామీయ షరీయతు సూచించినట్లు విడిపోవటం మేలు.
16. ఇంటి పనులలో బద్ధకం, సోమరితనం పనికిరాదు. ఒకవేళ పని మనుషులు ఉన్నప్పటికీ ఏదో ఒక వ్యాపకం అవసరం. ఇంట్లో సామాన్లను చక్కగా సర్దిపెట్టుకోవాలి. ఇల్లు పరిశుభ్రంగా ఉంచాలి.
17. పిల్లల పెంపకంలో, శిక్షణ విషయంలో ఎల్లప్పుడూ అప్రమ త్తంగా ఉండాలి.
18. భర్త సంపాదన చాలీచాలని విధంగా ఉన్నప్పుడు లేదా భర్త ఆర్థికంగా చితికిపోయినప్పుడు షరీయతు విధించిన హద్దులలో ఉంటూ కుటుంబ ఆదాయం కొరకు ఏదైనా పనిచేయాలి. ఒకరి ముందుకు వెళ్ళి చేయి చాపటం కన్నా, అప్పుల భారం మోస్తూ ఉండటం కన్నా

ఏదైనా పని చేసుకుని భర్తకు అండగా నిలవటం మంచిది కదా! అయితే ప్రతి స్త్రీకి ఇది సాధ్యం కాకపోవచ్చు. ప్రతిచోటా పరిస్థితులు ఇందుకు సానుకూలంగా కూడా ఉండకపోవచ్చు. అదీగాక కుటుంబ పోషణా భారం స్త్రీపై లేదు. కాబట్టి వీలైతేనే ఏదన్నా చేయగలగాలి. ఇది ఆమె నైతిక బాధ్యతేగాని, విద్యుక్త ధర్మం కాదు.

19. ఆచార వ్యవహారాలలో, నడవడికలో, బంధువుల హక్కు ఇవ్వటంలో, అతిథి మర్యాదలో భార్య ఒక ఆదర్శ ఇల్లాలిగా రాణించాలి. సత్కార్యాలలో, భయభక్తులలో అందరికన్నా ముందంజ వేసేందుకు ప్రయత్నించాలి. ఆమెగారి ప్రతి పనిని పిల్లలు అనుకరిస్తారు. కాబట్టి ఆమె స్వయంగా క్రమశిక్షణకు బద్ధురాలై ఉంటూ తన పిల్లలపై మంచి ప్రభావం వేయాలి.

20. ఇల్లాలు తన ఆరోగ్యాన్ని కాపాడుకుంటూ, తన శారీరక, మానసిక శక్తి సామర్థ్యాలను మెరుగుపరచుకుంటూ ఉండాలి. తీరిక సమయాల్లో పుస్తక పఠనం చేయాలి. తన తెలివితేటలను సద్వినియోగం చేసుకుని శిక్షణా రంగంలో తన వ్యక్తిత్వాన్ని ఇనుమడింపజేసుకోవాలి.

21. తానెక్కడ ఉన్నా తన మంచితనం ద్వారా, సత్ప్రవర్తన ద్వారా పరిసరాలలో తన ఉనికిని అందరూ గుర్తించేలా చేసుకోవాలి. తన అస్తిత్వం ద్వారా ఒకరికి మేలు జరిగేలా కృషి చేయాలి. ముస్లిం సమాజంలో ప్రయోజకుల అవసరం ఎల్లప్పుడూ ఉంటుంది. పనికిమాలిన వారి అవసరం ఉండదు. గయ్యాళిగంపల అవసరం అసలే ఉండదు.

ఆనందదాయకమైన, పవిత్రమైన జీవితానికి ఇవి స్థూలంగా కొన్ని మౌలిక సూత్రాలు.

